# ఆంధ్రపత్రిక

317023





The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 34 No. 317 THURSDAY 11th MARCH 1948 వెల ఒక అణా { Founder: K Nageswara Rao


# స్వదేశ సంస్థానాల ఏకీకరణ, కలయిక: భారత ప్రభుత్వ విధానం

## అగ్రరాజ్యాల దృక్పథం మారకపోయినట్లయితే,-

## తృతీయప్రపంచ మహాసంగ్రామం తప్పదనిడీవెలరా

న్యూయార్కు, మార్చి 9: 'ప్రపంచము తృతీయ ప్రపంచ మహా సంగ్రామమునకు అభిముఖముగా నడుచుచున్న దని నమ్ముచున్నాను' అని నిన్న యిచ్చటికి విచ్చేసిన 'డీవెలరా గారు పత్రికా ప్రతినిధుల సభలో ప్రసంగించుచు చెప్పిరి.

'ఐక్యరాజ్యముల సమితి భవిష్యత్తు విషయమై నేను నిరాశ చెందుచున్నాను. కాని అగ్రరాజ్యముల దృక్పథము మారినగాని అగ్రజ పదము కాజాలదు. ఒక్క రాజ్యసమితి దృక్పథము మారుటవసరమని వేరుగా చెప్ప నవసరము లేదని తలతును. వారి దృక్పథములో యిట్టిమార్పు రానియెడల యుద్ధం తప్పదు' అని ఆయన చెప్పెను.

ఐర్లెండు విభజనమును అంతము చేయుటకు అమెరికనుల తోడ్పాటు పొందుటకు వచ్చితిరా యని ప్రశ్నింపగా కాదు. అట్టి ప్రత్యేకోద్దేశముతో రాకపోయినప్పటికి, విభజనలన్నియు హానికరమైనవని, తాను అమెరికాలో నుండుటవల్ల విభజన అంతమగుటకు దోహదము కలిగినయెడల తాను సంతసించు నని, ఐర్లెండు విభజన అంతమగువరకు నిజమైన ఐరిష్ పౌరుడెవ్వడు సంతృప్తి చెందడని మాజీ ఐరిష్ ప్రధాని డీవెలరా గారనిరి. శాంతియుతములగు మార్గముల ద్వారా ఐర్లెండు విభజనను అంతము చేయవీలగునని తలచుచున్నాను' అని ఆయన చెప్పెను. ఇంగ్లండు రాజీకి వచ్చు సూచన యేమియు కనబడుట లేదని ఆయన చెప్పుచు తాను అహింసావాదిగా నుండలేనని, వివేకము, రాజనీతిలో తనకు నమ్మకముండెనని, బలప్రయోగములో నమ్మకము లేదని ఆయన చెప్పెను.

నేడు డీవెలరా గారు న్యూయార్కు నగర గౌరవ పౌరసత్వము పొందెను.

## స్వల్పకాలంలోనే సఫలీకృతమైనదని సర్దార్ పటేల్ ప్రకటన

### సంస్థానశాఖ కృషికి అటంకం కలిగించే ప్రజాందోళన పనికిరాదని హెచ్చరిక

న్యూఢిల్లీ, మార్చి 9: ఇండియను యూనియను ఉప ప్రధాని సర్దార్ పటేల్ గారు నేటి రాత్రి ఒక ప్రకటన గావించుచూ, తూర్పు పంజాబు కొండప్రాంతముల సంస్థానములు పరిపాలనాధికారముల నన్నిటిని ఇండియా ప్రభుత్వపరము గావించు ప్రకటన ప్రత్యేకముగా జారిచేయబడినది. వీటినన్నిటిని ఏకము చేసి కేంద్రప్రభుత్వ పరిపాలిత ప్రాంతముగా చేసెదరని చెప్పుచున్నారు. బుందేల్ ఖండు, గుజరాత్, మధ్యఇండియా సంస్థానములు గూడ ఇండియన్ యూనియనులో కలియుగోరు లేదా ఏకము కాగోరు సూచనలను, ప్రార్థనలను గావించెనని ఆయన చెప్పుచు, యివి ఏకమగుటలో తోడ్పడుటకు తాను సంస్థాన కార్యదర్శిని పంపుచుండెనని తరువాత యితర చిన్న సంస్థానముల విషయమై విచారింపవలసి యుండునని చెప్పిరి.

చిన్న సంస్థానములను ఏకము చేయు విధానమును, హిందూస్థాన్ బాధ్యతాయుత ప్రభుత్వ మేర్పరచు విధానమును సంస్థాన శాఖవారు అవలంబించుచుండిరని ఆయన చెప్పుచు స్వల్పకాలములో ఈ విధానము చాలా ధనవ్యయరహితముగా, సంస్థానాధీశుల ప్రశంసనీయమగు దేశభక్తితో చాలా మనుష్యహితముగా ప్రవర్తించిరని, వారి సహాయములో తమ లక్ష్యము అనుకొన్నదాని కంటె ముందే నెరవేరినదట నిస్సంశయముగా చెప్పెను.

సంస్థానాధీశ్వరులతో రాయబారములు జరిపి, క్లిష్టములును, సునిశితములును అగు ఈ సమస్యలను తాము నిరాఘాటముగా పరిష్కరించెదరని సర్దార్ గారు చెప్పుచు ఈ రాయబారములు జరుగుచున్న సమయమున బాధ్యతాయుత ప్రభుత్వమునకై గాని, చిన్న సంస్థానములు సైన్యానిలో చేరుటకుగాని ఆందోళన చేయరాదనుచున్నారు. ఇట్టి ఆందోళన సంస్థానశాఖ వారి కృషికి ఆటంకముగా నుండునని, శాంతియుతముగా ప్రజలకు అధికారము సంక్రమింపచేయుటయని కష్టమగునని చెప్పుచున్నారు. సంస్థానములలో ఆందోళనను ఆపివేయవలెనని షేక్ అబ్దుల్లా గారు గావిం


(4 పేజీ చూడుడు)


## హిందిలోగాంధిజీవితసర్వస్వం

### 25 సంపుటాలలో ప్రకటించడానికి కాశీ విద్యాపీఠంవారి సంకల్పం

కాశీ, మార్చి 8: పండిట్ కమలాపతి త్రిపాఠీ ఎమ్. ఎల్. ఏ. గారి సంపాదకత్వాన కాశీ విద్యాపీఠంవారు "గాంధీజీ" అన్న పేరుతో, మహాత్ముని జీవితకథ, ఆయన రచనల సూక్తులు, గాంధీజీ నిర్యాణానికి దుఃఖిస్తూ ప్రపంచం వెలిబుచ్చిన సానుతాప సందేశాలు, హిందీలో ఇరవై అయిదు సంపుటాలలో ప్రకటించబడతవి.

## ఢిల్లీఆయుర్వేదకళాశాల పేరు మార్పు

న్యూఢిల్లీ, మార్చి 8: గాంధీజీ స్మారకార్థం ఢిల్లీలోఉన్న ఆయుర్వేదిక్ యునానీ టిబ్బియా కాలేజీని ఇకమీదట గాంధీ అజ్మల్ ఆయుర్వేదిక్, యునానీ టిబ్బియా కాలేజీ అన్న పేరుతో పిలవాలని కాలేజీ ధర్మకర్తలు తీర్మానించారు.

## ప్రాచ్యఖండానికి తలమానికం వంటిది భారతదేశం

### ట్రాన్స్‌జోర్డాన్ రాజు అబ్దుల్లా శుభాకాంక్ష

న్యూఢిల్లీ, మార్చి 8: ట్రాన్స్‌జోర్డాన్ మంత్రియున్నూ, ప్రత్యేక రాయబారియున్నూ అయిన మహమ్మద్ పాషాఎల్ మరేకి గత శనివారం నాడు పండిట్ నెహ్రూను ట్రాన్స్ జోర్డాన్ తరఫున అభివాదాలు అర్పిస్తూ ఇలా అన్నాడు: "తమ లక్ష్యాలు సమాప్తమైనవేగాని లక్ష్యసాధనకు అన్యోన్య సహకారం అవసరమని ప్రాచ్య దేశాలు సర్దించిన వనజానికి మొదిక్కడికి రాకడమే నిదర్శనం." "మహాభారతదేశం యొక్క యోగక్షేమాలు అభివృద్ధి కావాలని తాను ఆకాంక్షిస్తున్నాననీ, ప్రాచ్యదేశాలకు తలమానికమైన భారతదేశంతో సన్నిహితసంబంధాలు నెలకొల్పుకోవాలని తాను హృదయపూర్వకంగా వాంఛిస్తున్నాననీ, అబ్దుల్లాగారు సందేశం పంపాడు. అఖిల మానవ సౌభ్రాత్రాన్ని పెంపొందించడానికి గాంధీజీ చేసిన అఖండకృషిని ప్రశంసిస్తూ రాయబారి గాంధీజీ స్మృతికి శ్రద్ధాంజలి ఘటించాడు.

## జార్జి రాజు . ఆస్ట్రేలియా పర్యటన

కాన్బెరా, మార్చి 9: జార్జి రాజు గారున్ను ఎలిజబెతు రాణీ యున్ను 1949 వ ॥ మార్చి నెలలో ఆస్ట్రేలియాకు వెళ్లెదరని యూధిగా తెలియుచున్నది. వారు మొదట న్యూజీలాండు వెళ్లెదరు. ఈ పర్యటన అంతయును 10 లేక 12 రోజులు పట్టును.

## కమ్యూనిస్టులతో కామన్సు సభ్యుల రహస్య ప్రమేయం

లండన్, మార్చి 8: బ్రిటిష్ పార్లమెంటులో కమ్యూనిస్టు పార్టీతో రహస్య ప్రమేయం కలిగిన సభ్యులున్నారని "డెయిలీ మెయిల్" పత్రిక ప్రకటించిన హెచ్చరికను జాగ్రత్తగా పరిశోధించమని కామన్సుసభ నేడు తన "ప్రివిలేజస్" కమిటీని ఆదేశించింది.

పార్లమెంటులో 29 మంది విద్రోహులున్నారని, వీరే ముందుముందు శత్రు పక్ష సాధకులవుతారని డెయిలీ మెయిల్ పత్రిక హెచ్చరించినట్లు లేబర్ సభ్యులు కొందరు సభకు తెలియజేశారు. ఈ విద్రోహులు రష్యనులకు బ్రిటిష్ రక్షణ ప్రయత్నాలను గూర్చి తెల్లడించడానికి అవకాశమున్నదని కూడా డెయిలీ మెయిల్ సంపాదకుడు అన్నాడట.

## అధినివేశ శాసనసభ

### కాంగ్రెస్ పార్టీ నాయకుడుగా తిరిగి నెహ్రూ ఎన్నిక

న్యూఢిల్లీ, మార్చి 9: అధినివేశ శాసనసభలోని కాంగ్రెసుపార్టీ సభ్యులు ఇవాళ కౌన్సిలు సభాభవనంలో సమావేశమై ఈ క్రిందివారిని పార్టీ కార్యవర్గంగా ఎన్నుకొన్నారు.

నాయకుడు: పండిట్ జవహర్లాల్ నెహ్రూ.

ఉపనాయకుడు: సర్దార్ వల్లభాయ్ పటేలు.

ప్రధానచోదకుడు (ఛీఫ్ విప్): శ్రీ సత్యనారాయణసింహా.

చోదకులు: (1) శ్రీ గోకుల భాయ్ భట్; (2) శ్రీ ఏ. సి. గుహా; (3) శ్రీ యం. ఎస్. మల్లయ్య.

కార్యదర్శులు: (1) శ్రీ మోహన్‌లాల్ సక్సేనా; (2) శ్రీ అనంతశయనం అయ్యంగార్; (3) ప్రొ॥ ఎన్. జి రంగా.

కోశాధ్యక్షుడు: సేఠ్ గోవిందదాస్.

ఆడిటర్: శ్రీ టి. టి. కృష్ణమాచారి.

కార్యవర్గ సభ్యులు: మౌలానా అబుల్ కలాం అజాద్; రోహిణీకుమార్ చౌదరి; డా॥ పట్టాభి సీతారామయ్య; గ్యానీ గురుముఖ్ సింగ్ ముసాఫిర్; కె. సంతానం; జగ్జీవన్‌రామ్; దుర్గాబాయ్; రాఫీ అహ్మద్ కిద్వాయ్; జె. బి. కృపలానీ; ఎస్. నిజలింగప్ప; డా॥ పి. ఎస్. దేశ్‌ముఖ్; లక్ష్మీకాంత మైత్ర; పండిట్ ఠాకూర్‌దాస్ భార్గవ; లాలా దేశబంధుగుప్త; ఆర్. కె. సిధ్వా.

---

న్యూయార్కు, మార్చి 8: అమెరికాలో ఉన్న బ్రిటిష్ సమాచారశాఖ ఇండియాకు ప్రతికూలం ప్రచారం సాగిస్తున్నదని పండిట్ నెహ్రూ చేసిన ఆరోపణలు నిరాధారమని ఇక్కడి బ్రిటిష్ సమాచార శాఖాధికారి సార్సివిడ్యండ్సన్ నేడొక ప్రకటన చేశాడు

## ఏ సంస్థానాధీశ్వరుడికీ స్వంతఖర్చుల క్రింద సాలుకు 10 లక్షలకు మించి ఇవ్వరు

న్యూఢిల్లీ, మార్చి 8: రాబోవు ఏప్రిల్ 1వ తేదీనుండి ఇండియన్ యూనియనులో చేరిన ఏ సంస్థానాధీశ్వరునికి అతని స్వంతఖర్చులకుగాను 10 లక్షల రూపాయల కంటె యెక్కువ యివ్వరు.

సంస్థానాధీశ్వరులు పుచ్చుకొనదగిన మొత్తమును నిర్ణయించుటకు ఇండియా ప్రభుత్వ సంస్థానశాఖవారు ఒక ప్రణాళికను తయారు చేసిరని భారత యునైటెడ్ ప్రెస్ వారికి తెలియుచున్నది.

సంస్థానాధీశ్వరుని స్వంతఖర్చు 10 లక్షలకు మించరాదని ప్రణాళిక తెలుపుచున్నది. సంస్థానాధీశ్వరునిచ్చు మొత్తమును ఈ క్రిందివిధముగా లెక్కకట్టెదరు: సంస్థానము యొక్క మొత్తం ఆదాయములో మొదటి లక్ష ఆదాయమునకు 100-కి 15 వంతులు అనగా 15 వేలు సంస్థానాధీశ్వరునికి పోవును. తరువాత నాల్గులక్షలకు 100-కి 10 వంతులు అనగా 40 వేలు సంస్థానాధీశ్వరుని స్వంతఖర్చుకు జమకట్టబడును. తరువాత ప్రతి లక్షకు 100-కి $7\frac{1}{2}$ చొప్పున సంస్థానాధీశ్వరుని స్వంతఖర్చుకు జమకట్టుదురు. 10 లక్షలకంటె యే సంస్థానాధీశ్వరుడు యెక్కువ పుచ్చుకొన వీలు లేదు. 1945-46 సం॥ ము ఆదాయముపై సంస్థానాధీశ్వరుని స్వంతఖర్చు లెక్కకట్టెదరని తెలియుచున్నది. ఇండియన్ యూనియనులో కలిసిపోయిన సంస్థానములకు, ఇండియన్ యూనియనులో చేరినవానికి గూడ ఏప్రిల్ 15 తేదీనుండి యిది వర్తించునని యునైటెడ్ ప్రెస్‌వారికి తెలియుచున్నది. — యు. ప్రె

## ఇండోనేసియాలోవాన్‌మూక్ అధ్వర్యాన తాత్కాలిక ఫెడరల్ ప్రభుత్వ స్థాపన

బటేవియా, మార్చి 9: డచ్చి గవర్నరు జనరల్ డాక్టరు హ్యూబర్టస్ వాన్‌మూక్ నేడిక్కడ ఇండోనేసియా తాత్కాలిక ఫెడరల్ ప్రభుత్వమును స్థాపించాడు. వచ్చే సంవత్సరము జనవరి 1 వ తేదీన ఇండోనేసియా సంయుక్త రాష్ట్రము ఏర్పడేవరకూ ఈ తాత్కాలిక ప్రభుత్వం పనిచేస్తూ వుంటుంది దీనికధ్యక్షుడు వాన్ మూక్.

ఈ తాత్కాలిక ప్రభుత్వంలో రిపబ్లికనులెవ్వరూ ప్రవేశించలేదు. కాని వారు రాదలచుకొంటే ద్వారములెప్పుడూ తెరచబడే వుంటాయని వాన్‌మూక్ అన్నాడు. ఈ ప్రభుత్వస్థాపనతో ఇండోనేసియనులూ, డచ్చివారికీ మధ్య పరస్పర వ్యక్తిగత సహకారము మెక్కువ అయ్యే అవకాశాలు కన్పిస్తున్నాయనికూడా అతడన్నాడు.

తాత్కాలిక ప్రభుత్వంలో రిపబ్లికనులు పాల్గొనే షరతులనుగూర్చి డాక్టర్ వాన్‌మూక్‌తో చర్చించుటకై రిపబ్లికన్ ప్రధాని మహమ్మద్ హట్టా గురువారం నాడు బటేవియాకు వస్తాడట.

